సం॥ర చందా రు 1-0-0 (పోస్టేజితో సహా) Reg. No. M. 3766

సంపుటము 31 సంచిక 3

# ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

# Andhra Rastra Prarambha Vidya

(విద్యావిషయిక మాసపత్రిక)

జూన్ 1942

సంపాదకులు:

శ్రీయుత మహావాది వేంకటరత్నముగారు, బి.ఏ.,



వ్యవస్థాపకులు.

శ్రీయుత ఈదర వెంకయ్యగారు,

ప్రొప్రయిటరు:.

రామా అండ్ కో.,

హెడ్ ఆఫీసు :— ఏలూరు,



బ్రాంచెస్ :— మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.

Printed by Mr Edara Venkaiah at his Pattabhirama Press, Ellore.

# విషయసూచిక

ఆంధ్రరాష్ట్ర ప్రారంభవిద్య

ANDHRA RASTRA PRARAMBHA VIDYA

విద్యావిషయిక మాసపత్రిక

| సంపుటము 31 | ఏలూరు 15 జూన్ 1942 | సంచిక 3 |
|---|---|---|

# నిత్యసంకీర్తనము

వివరణము :

ప్రపంచజ్ఞానముకంటె ఉన్నతమగునది మరొకశక్తి కలదు. ఆ యున్నత భావ ప్రపంచము దీనికన్న వేఱైనదిమాత్రముకాదు. దానిని ఇచటనే చూడవచ్చును. ఇపుడే చూడవచ్చునుగూడ. సరియగు ద్వారమును దెరువక మనము వానిని చూడఁజాలకున్నాము. ఈ పరిమిత ప్రపంచములో నిత్యమగు శాంతి, సౌఖ్యములఁ బొందినవాఁడొక్కఁడును లేడు. అంతరంగమునఁ గనుగొనినవారు పిమ్మట బయటనుగూడ చూడఁగలరు. ఉన్నతసౌఖ్యము లభించునపుడు నీచసౌఖ్యమును విడనాడుదుము.

సంకీర్తనము :

1. హే అనంతసౌఖ్య ప్రదాతా! నాహృదయంబునకు దివ్యానంద మొసంగుము.
2. నాచిత్తమున నెట్టి నీచభావములను చొరనివ్వకుము.
3. నాహృదయ మెప్పుడును నీవు నిలచుటకుఁ దగిన వేదిక యగుఁగాక !

—స్వామిరామానందతీర్థులు.

*

# దైవ ప్రార్థనము

( 1 త. మొదలు 5 వ త. బాల బాలికలకు )

రచయిత : ఏలూరు వెంకటరమణమూర్తి

## ౧. ఉదయప్రార్థనము

1. దేవకావవే నేడుమమ్ములన్
నీవె రాత్రి కాచినావు - నిను భజింతుము॥ దేవ॥
2. ఆపదలు మముఁ - అంటకుండను
దాపుజేరి దయను గావు - తప్పులెన్నక॥ దేవ॥
3. నేటికార్యముల్ - నేడుచేయఁగా
సూటియైన త్రోవమాకు - చూపుమో ప్రభూ॥ దేవ॥
4. చెడ్డకార్యముల్ - చేయకుండను
దొడ్డబుద్ధి మాకొసంగి - తోడ్పడంగదే॥ దేవ॥

## ౨. సాయం ప్రార్థనము

1. దేవకావవే రాత్రిమమ్ములఁ
నీవె పగలు గాచినావు - నిన్ను గొల్తుము॥ దేవ॥
2. నీవెదిక్కుగా - నిద్రపోదుము
దేవదేవ మమ్ము నెల్లఁ - గావుమాకృపఁ ॥ దేవ॥
3. దుష్టస్వప్నముల్ - దొంగభయమును
కష్టములను దొలఁగఁజేసి - కరుణ నేలుమా॥ దేవ॥

ఓమ్

# ఒకటవ తరగతికి తెలుగు భాషను నేర్పుటకు

## మొదటి పాఠములు

(పరిగె వెంకటరమణరావు, సీనియర్ డిప్యూటీ ఇన్‌స్పెక్టరు, పల్నాడు.)

(గత సంచిక తరువాయి)

### ్న ఒత్తు

1 కన్ను 1 అన్న

1 స్నానము 2 చిన్న

3 రాట్నము

1 ఇది నా కుడి కన్ను
2 నేను రోజు స్నానము చేయుదును
3 ఆయన మా అన్న
4 మా అన్న కన్న నేను చిన్న
5 మా అక్క రాట్నము మీద నూలు వడుకును

### ్ప ఒత్తు

1 నొప్పి 1 ఉప్పు 1 తూర్పు

2 అప్ప

3 ఇప్పుడు

1 నా కాలు నొప్పికి మందు వేస్తారా?
2 ఉప్పు తీయగా ఉండునా?
3 ఆయన మా అప్పగారు
4 ఇప్పుడు బడివేళ అయినది
5 మా బడికి తూర్పున మేము ఆడు కొందుము

### ్బ ఒత్తు

1 దెబ్బ 1 కొబ్బరికాయ

2 సబ్బు 1 అబ్బ

1 నా చేతికి దెబ్బ తగిలినది
2 సబ్బుతో నా శరీరమును తోము కొందును
3 మా అన్న కొబ్బరికాయను తెచ్చి నాకు యిచ్చినాడు
4 మా బడిలో అబ్బ, అబ్బ యెంత గోల

### ్మ ఒత్తు

1 బొమ్మ 1 అమ్మ

1 తొమ్మిది 2 తమ్ముడు

2 అమ్మాయి

1 నేను ఆవు బొమ్మను గీయగలను
2 ఆమె మా అమ్మ
3 అతడు నా చిన్న తమ్ముడు
4 మా తరగతిలో తొమ్మిదిమంది బాలురు ఉన్నారు
5 మా బడిలో నేను మా అమ్మాయి ఆడుకుంటాము

౯ ఒత్తు

1 ఆరోగ్యము 1 అయ్య

2 తియ్యని 2 సూర్యుడు

3 మనుష్యులు

1 నాకు ఆరోగ్యము కలిగియుండుటకు మితముగా భుజించుదును
2 తియ్యని వస్తువులు నాకు రుచి
3 మా యింటిలో పెద్దవాడు మా అయ్య
4 మనకు ఆరోగ్యము కలుగుటకు ఉదయమున సూర్యునకు నమస్కరించవలయును
5 మా యింటి ముందరగా మనుష్యులు పోవుచుందురు

ఱ ఒత్తు

1 రాత్రి

2 నిద్ర

3 ప్రొద్దున

4 శుభ్రమగు

5 త్రాగుదును

6 గుండ్రని

7 చక్రము

1 నేను రాత్రి తొందరగా నిద్రపోవుదును
2 నేను ప్రొద్దుననే నిద్ర లేచుదును
3 నేను యెప్పుడును శుభ్రమగు నీటినే త్రాగుదును
4 నేను గుండ్రని చక్రముతో ఆడుకొందును

ల ఒత్తు

1 బెల్లము 1 ఇల్లు

2 పొట్లకాయ 2 పిల్లలు

3 వెళ్లగలను

1 బెల్లము నాకు చాల ప్రీతియైన వస్తువు
2 పొట్లకాయ పెరుగు పచ్చడిని నేను యెక్కువగా తినగలను
3 నేను ఒక్కడనే బజారుకు వెళ్లగలను
4 ఇది మా ఇల్లు
5 మా యింటిలో చాలమంది పిల్లలు ఉన్నారు

వ ఒత్తు

1 నవ్వు 1 అవ్వ
2 స్వభావము
3 జ్వరము
4 పువ్వు

1 చిరునవ్వును కలిగియుండుట నా స్వభావము
2 అజీర్ణములేకున్న నాకు జ్వరము రాదు
3 పువ్వులతో దేవుని పూజ చేయుదమా?
4 మా అవ్వ మాకు మంచి మంచి కథలు చెప్పును

శ ఒత్తు

1 స్పర్శ

1 గాలి ఉన్నదని స్పర్శవలన తెలిసి కొనుచున్నాము

ష ఒత్తు

1 వర్షము

1 పెద్ద వర్షము కురియుచున్నప్పుడు నేను బడికి పోజాలను

స ఒత్తు

1 వయస్సు
2 సంవత్సరములు

1 నా వయస్సు ఆరు సంవత్సరములు

---

# ఆంధ్రవాఙ్మయము

"కె. ఎ స్వామి"

అనాగరకుడై చెట్ల తొఱ్ఱలలో నివసించు మానవుడు, చర్మమో చెట్టు పట్టలో కట్టుబట్టలుగా గల మానవుడు, నేడు చంద్రకాంత శిలాసౌధములలో నివసించుచున్నాడు. చీనిచీనాంబరముల ధరించుచున్నాడు. భూమిమీదను, భూగర్భముననను, పొగబండ్లు నిర్మించి ప్రయాణము చేయుచున్నాడు. విమానములు, రేడియోలు, మొదలుగాగల యనేకములగు యంత్రములను తయారు చేసి గాలిలో నెగురగలుగుచున్నాడు. వాయుమార్గమున వినగలుగుచున్నాడు. ఆహా! మానవప్రకృతి యెంతటి నాగరికతను పొందినది? ఎన్నిమార్పులిందు సంభవించినవి? మానవప్రకృతికి తోడు సర్వశాస్త్రములును, సర్వకళలును, అనేక విధముల వృద్ధిజెంది శాఖోపశాఖలైనవి. ఆంధ్రవాఙ్మయము కూడ పలుతెరంగుల క్రమగతిని పొందినది. పురాణయుగము గడచినది. ప్రబంధయుగము మారినది. నాటక, నవలాయుగము లిప్పుడిపుడ పోవుచున్నవి. నవ్యయుగమున అనేకరీతుల ఆంధ్రభాషామతల్లి వృద్ధినొందుచున్నది.

ఆంధ్రులచే మాటాడబడు భాష 'ఆంధ్రము' త్రిలింగదేశమధ్యస్థ వ్యవహార సిద్ధమైన భాష తెలుగు. దీని పర్యాయమే తెనుగు. తెలుగుభాష పాశ్చాత్య పండిత ప్రకాండులచే సహితము The Italian-of the East. అని పేరెన్నికగన్నది. ఆంధ్ర వాఙ్మయము ఆంధ్రుల చరిత్రను, మతమును, అనుసరించి వృద్ధిచెందినది. కాల ప్రవాహమున నానావిధముల పరిణామమును పొందిన ఆంధ్రవాఙ్మయమును కొన్ని యుగములుగా భాగింపవచ్చును.

అజ్ఞాతయుగము:— ఆంధ్రభాషలో నన్నయ్యకుఁ బూర్వమనేక గ్రంథములుండిన నందును. తనుపలబ్ధిలేకపోయినది. నన్నయకు పూర్వ మాంధ్రభాష లేదనిగాని, అందు గ్రంథములు లేవనికాని యెవ్వరును చెప్పజాలరు. ఇప్పటికి విమర్శకులు నిర్ణయించిన ప్రకారము భారతమే తెలుగున నాదిగ్రంథము. నన్నయభట్టు ప్రథమాంధ్రకవియని తెలియనగు. నన్నయకు పూర్వ మాంధ్రమున గ్రంథములు లేనిపక్షమున భారతమువంటి మహోత్కృష్టగ్రంథరాజము ఒక్కసారిగా వెలువడుట యసహజము. పదునొకొండవ శతాబ్దమునకు పూర్వ మాంధ్రభాషలో గ్రంథములున్నను మనకు తదుపలబ్ధి లేకపోవుటచే ఆ యుగమును అజ్ఞాతయుగమని వ్యవహరించుచున్నాము. ఈ యుగమున దేశి, మార్గయని యిరుతెరంగుల తెలుగుభాష వృద్ధిచెందినది. "మార్గ" సంస్కృత భాషకు సంబంధించినది. "దేశి" తెలుగుల జాతీయభాష. ఆ కాలమున గ్రామ సాంఘిక జీవనమునకు తోడ్పడు పాటలు, గీతములు, లాలిపాటలు, జావళులు, పదములు, కీర్తనలు, మంగళహారతులు, మొదలగునవి జాతీయభాషలోనే యుండెడివి.

పురాణయుగము:— పురాణమనగా "పాతకథ" యనిభావము. ఇది భక్త్యుత్పాదకమును, నీతిబోధకమునై యుండవలెను. పదునెనిమిది పురాణములు భాషాంతరీకరింపబడుటచే యీ యుగము పురాణయుగ మనబరగినది. బౌద్ధ, జైన మతములందు దేశభాషలలో గ్రంథములు పొడసూపినవి. వేదమత రక్షణార్థమై యనేకులపుడు అష్టాదశ పురాణములను సంస్కృతభాషలోనుండి భాషాంతరీకరించిరి. అందుచే యీ యుగమునకు భాషాంతరీకరణ యుగమను నామాంతరమును గలదు.

భారతము-నన్నయ్య:- ఈయుగమునకు నాంది నన్నయ భట్టారకుడు. కాసట బీసటగానున్న ఆంధ్రభాషను తీర్చిదిద్దిన ధీశాలి; శబ్దశాసనుడు. రాజరాజనరేంద్రుని ప్రోత్సాహమున గవితాప్రపంచమును సృజించి భారతభాగములను ఆంధ్రీకరించి తెలుగు భాషకొక క్రొత్త నుడికారమును జూపెను. ఆంధ్రశబ్ద చింతామణిని రచించి ఆంధ్రభాషకు అంజలి ఘటించినాడు. ఈతని రచన మృదుమధురమై శబ్దాలంకార శోభితమై యుండును. ఈతడు 50% వచనమునే భారతమున రచించియున్నాడు.

తిక్కనసోమయాజి:—తిక్కన విరాటపర్వ మాదిగా పదునైదు పర్వములు నాంధ్రావళి మోదము బొరయునట్లు రచించిన దొడ్డకవి. మహియేన్ వాగను శాసనుండు సృజియింపన్, కుండలీంద్రుండు తన్మహనీయస్థితి మూలమైనిలిచె.

భట్టారకునితో నవతరించిన యాంధ్ర భాషకు జాతీయత నేర్పరచినవాడుతిక్కన. ఈతడు విరాటాదులందు జూపిన కవిత్వ ప్రటుత్వ సంపద లనదృశములు. ఈతని కాలము నాటికి వచసరచన క్షీణించుచు వచ్చినది. ఈతని నిర్వచనోత్తర రామాయణ మిందుల కుదాహృతము. భేదము లేని భక్తితత్వమున హరిహర బ్రహ్మ నుపాసించినాడు తిక్కన. ప్రపంచవిఖ్యాతి గణించిన హూణగీర్వాణ సాహిత్యముల లోని షేక్స్పియర్, కాళిదాస మహాకవులతో సాటియగు మహాకవి మన యాంధ్ర సాహిత్యమున గలడేని, అతడొక్క తిక్కన దక్క మరియొకడు కాజాలడు మహాత్ములు కారణజన్ములు.

సీ॥ మనకు నిత్యము పర్వదినముగా
పదునైదు పర్వము లిడిన యపూ
ర్వదాత
తనభారతీ కన్యకను వరించిన యట్టి
మనుమసిద్ధి నృపాలు మామగారు
హరిహర బ్రహ్మ ప్రత్యక్షమై
వరమిచ్చి తనభక్తి మెచ్చిన
తెనుగు యోగి
ఘనుడువ్యాసుని కథాకథనంబునకుఁ జాల
మెరుగు వెట్టినయట్టి మేటిజాణ
కాళిదాసాది విఖ్యాత కవినిభుండు
షేక్స్పియరువంటి విఖ్యాత శిల్పవేత్త
మన, కవిబ్రహ్మ తిక్కనామాత్యు
దలచి
గర్వపడుడయ్య! యాంధ్రులు గర్వ
పడుడు." భో॥ నా॥

"తిక్కన యాంధ్ర సాహిత్యశిల్పవేత్తలలో యగ్రగణ్యుడు; కవిబ్రహ్మ."

ఎఱ్ఱాప్రగడ:-అరణ్యపర్వ శేష పూరణంబున నన్నయ ననుకరించి ప్రతిభ గనబరచెను ప్రబంధశైలి కితడే మార్గదర్శి. ఈతని ప్రబంధశైలి ననుసరించి శ్రీనాథాదులు గ్రంథములు మనోహరముగ వ్రాసిరి. హరివంశమను గ్రంథమును గూడనీతడు రచించెను. ఈతని బిరుదములు ప్రబంధ పరమేశ్వరుడు, శంభుదాసుడు. నన్నయ, తిక్కన, ప్రగడలను కవిత్రయ మందురు. వీరుముగ్వురు ఒకకాలములోనివారుకారు. వీరలు భారతము పూర్తి చేయుసరికి సుమారు మూడు వందల సంవత్సరము పట్టినవి. వీరిరచనలాంధ్రవాణికి ప్రమాణములు

[సశేషము.]

# కడగండ్లు

యస్. వి. యస్.

ఒక ఆసామి రెండుఎద్దులను గలిపి ఒకత్రాటితో ఒక గుంజకు కట్టేశాడు. రెండు ఆకలిగొన్నై, చుట్టుప్రక్కల చూచాయి. రెంటికి రెండు కుప్పలమేత కనిపించింది. నేను మేత తినాలంటే, నేను తినాలని రెండు రెండువైపులా గుంజుకున్నై. ఎంతసేపు గుంజుకున్నా ప్రయోజనం లేకపోయింది. అలసిపోయినై. ఆరెండు ఒకమాట అనుకుని ఒకటి తినినతరువాత మరొకటి తినడానికి రాజీపడి ఆహారాన్ని పొందాయి.

ఈకథ చూచేసరికి మన ఉపాధ్యాయసంఘాలసంగతి జ్ఞప్తికొస్తుంది. ఒకటి జిల్లా బోర్డుతోను, మరొకటి మేనేజర్లతోను తమ సదుపాయాలకోసం పోరాడుతున్నవి. రెండు రెండువైపుల వున్న మేతలకోసం పోరాడుతున్నాయి. ఒకవేళ యివిరెండు సక్రమంగా యెక్కడైనా పని చేస్తుంటే, అవి తమ ఆర్థికయిబ్బందులను ట్రాన్సుఫర్లు మొదలగు వాటికోసమే పనిచేస్తున్నవి. ఈ పనైనా ఏకముఖంగా జరగడంలేదు. కొంతమంది సంఘంలోఉండికూడ, వ్యక్తిగతంగా తమ యిబ్బందులను బాపుకోడానికి ప్రయత్నిస్తున్నారు. దీనివల్ల సంఘముండికూడ ప్రయోజనం లేకపోతున్నది. దానివిలువగూడ తగ్గిపోతుంది.

ఇక ఎయిడెడ్ పాఠశాలల ఉపాధ్యాయసంఘం అసలు పనిచేయడంలేదు. దీనికి మొదటి కారణం ఉపాధ్యాయులు సంఘశక్తిని గుర్తించకపోవడం. రెండవది ఉపాధ్యాయ మేనేజర్లగూడ దీనిలో సభ్యులుగా ఉండడం. ఈ ఉపాధ్యాయ మేనేజర్లు అటు ఉపాధ్యాయ సంఘాలలోను, యిటు మేనేజర్ల సంఘాలలోను సభ్యులు వీరు రెండు సంఘాల సభ్యులు హక్కులనుపొంది ఉంటారు. ఈ రెండింటిని వారు కాపాడుకోటం కష్టం. కాబట్టి వీరు ఉండటంవల్ల ఉపాధ్యాయ సంఘ కార్యం స్తంభించిపోతుంది.

ఇక టీచర్సు అసోసియేషన్ ఉండిగదా అంటారు. ఈ సంఘం, యిన్స్పెక్టరు కొత్తనిబంధనలను తెలియజేయడానికి మాత్రమే పనికివస్తుంది. అక్కడ మనం మన కష్టనిష్టురాలను చెప్పుకోడానికి యేమాత్రం పనికిరావడంలేదు. వారు అమలు జరిపే విధానం ఎంతవరకు ఆచరణయోగ్యమో చర్చించడానికి మనకు సావకాశంలేదు. మనం దానిని అమలు జరిపితీరాలి.

ప్రతిదినం బళ్ళలో, ప్రభుత్వంవారు పెట్టిన రూల్సును, విద్యావిధానమును, అమలు జరపవలసినవాళ్లం మనం. వారి విధానం ప్రకారం చదువు చెప్పాలసిన వాళ్లం మనం. వారేర్పాటుచేసిన విధానం ఆచరణయోగ్యమా ? కాదా ? అను విషయం నిర్ణయించాల్సినవాళ్లం మనం. ఈ రూల్సు, విధానం, ఆచరణయోగ్యం కాకపోవడం వల్ల మనం అనేక తప్పుడుపనులు చేయాల్సివస్తున్నది. మనబ్రదుకు దినగండం అవుతున్నది. ఇట్టి పరిస్థితులలో ప్రభుత్వవిధానం అమలు జరపడంలో గల సాధకబాధకాలు చెప్పుకోడానికి మనకు సంఘాలు లేవు.

కాబట్టి మన కష్టనిష్టురాలను, ప్రభుత్వవిధానంలోని లోటుపాట్లను, సూచించి, దానికి తగిన నూతన సలహాల నివ్వడానికి, మనమందరం-బోర్డని, ఎయిడెడ్ అనే విభేదంలేక - ఏకకంఠంతో చెప్పగల సంస్థగా యేర్పడాలి. ఇప్పుడున్న సంఘాలు యేవిగూడ మనమందరం యేకంగావడానికి సహాయకారులు కావడంలేదు. ఇంకా పైగా యివి మనల వేరుచేసి దూరంచేయడానికి పనిచేస్తున్నయ్.

ఈ సంఘాలు మనకండ్లనీళ్లు తాత్కాలికంగా తుడవడానికి మననెత్తిన రుద్దబడ్డయి. అంతేగాని వీటివల్ల యధార్థమైన ప్రయోజనమేమిలేదు. కాబట్టి ప్రతి భాగంలో ఉపాధ్యాయులు అందరు ఒక ఫెడరేషన్గా ఏర్పడి ఏకకంఠంతో ప్రభు

త్వంతో మన హక్కులను గురించిపోరాడాలి. ఈ సంఘం ఆర్ధిక హక్కులను గురించి పోట్లాడటమేగాక, విద్యావిధానమందలి లోటుపాట్లను ప్రభుత్వమునకు తెలియజేసి, వాటికి సవరణలను సూచించాలి. మనం యీసంఘాన్ని ప్రభుత్వం గుర్తించేటట్లుగా చెయ్యాలి.

యోచించండి మీ మీఅభిప్రాయాలను ఈ పత్రికాముఖంగా ప్రకటించండి. ఇంక సెలవు

---

శ్రీరామాయనమః

# బా ల నీ తి

(1942 సం॥ జనవరి సంచిక తరువాయి)

చిలకా వేంకట కృష్ణదాసు

గీ॥ రాజు తనదేశమందు నే పూజితుఁడగు
పండితుఁడు లోకమంతట వంద్యుఁడగు న
నెడి నుడులను మానసమున నెరిగి విద్య
నమితముగ కష్టపడి పడయవలె బాల !

గీ॥ దొంగిలింప నసాధ్యము దొంగలకును
పంచుకొన వీలుకానిది బంధువులకు
దాన మెందరికిని జేయఁ దరుగ బోని
దట్టివిద్యాధనంబు చేపట్టు బాల !

గీ॥ ధనము విద్యయు భూములు ఘనగృహములు
గలిగినంతనే నావంటి ఘనుడు లేడ
టంచు కన్నుగానక సంచరించువాఁడు
కౌరవులు పొందినఫలంబె కాంచు బాల !

గీ॥ ధనికులను గాంచి యెక్కువధనము నాకు
లేదనుచు విచారించిన రాదు ధనము
నీకు మించిన బీదల నీవు గాంచి
మక్కువం దృప్తిఁ బొందుచు మనుము బాల !

గీ॥ సజ్జనులతోడిస్నేహంబు సౌఖ్యదంబు,
స్నేహితుఁడై కష్టకాలాన నీకు తోడు
నీడయై నిన్ను గాపాడు, నిరుపమానుఁ
డైనమిత్రుని విడువకు మయ్య బాల !

ఆ॥ వె॥ మాటలాడునపుడు మదిని ముందు దలప
కుండ మాటలాడ గూడ దెపుడు
మాటవలన నరుడు మంచిచెడ్డలు, గౌర
వంబు సద్యశంబుఁ బడయు బాల!
గీ॥ నీదుసహపాఠకులతోడ వాదులాడ
కడ్డు చెప్పకు మగ్రజునాజ్ఞ కెపుడు
చెడ్డవారితో స్నేహంబు సేయఁబోకు
మెవరినైనను దూషింప కెపుడు బాల!
గీ॥ కోపముండిన ప్రాపించు బాపచయము
కోప మెక్కంతయైనను కూడ దెపుడు
శాంతము వహించియుండిన సౌఖ్య మొదవు
శాంతియే వెలలేనిభూషణము బాల!

---

# స్త్రీ విద్య

తేజోమూర్తుల మల్లికార్జునుడు

పూర్వముకంటె యిప్పుడు బాలికా విద్యయందు తల్లిదండ్రులును ప్రభుత్వము వారును యెక్కువ శ్రద్ధచూపుచున్నారు. కాని యీశ్రద్ధచాలదు. పూర్వము దగ్గర దగ్గరలో బడులులేకను, బాలికలకు చదువులెందుకు అని, పూర్వపువారు నిర్లక్ష్యముచేసిరి. నిజంగా ఆలోచిస్తే స్త్రీవిద్య కూడదనే వాదన మధ్యకాలంలో బయలుదేరింది. స్త్రీ, విద్యనేర్చుకుంటే చెడిపోతుందనే దురభిప్రాయం కొంత మందికి లేకపోలేదు. స్త్రీలు చపలచిత్త లని వారి అభిప్రాయం. వారికోరిక, పట్టిన పట్టు నెరవేర్చుకునేవరకు నిద్రపోరు. పట్టినపట్టు వీడరు. ఇందుకు నిదర్శనం పూర్వకాలంలో సీత, సావిత్రి, చంద్రమతి, దమయంతి, జయప్రద, సత్యభామ మొదలగు మహాతల్లులు చదువుకున్నట్టుగా మన గ్రంథములు అనేక నిదర్శనము లిస్తున్నాయి. వీరందరు పరాయివాళ్లకు పెండ్లాడదలచినవారికి కాక మిగిలినవారికి ప్రేమలేఖలు వ్రాసినవారేనా? ఇట్టి అభిప్రాయాలు కలవారు మార్చుకొనుట యుత్తమము. ప్రస్తుతము చిన్నబడులలో చదివే చిగురుబోడులే పెద్దవారై గృహభారము వహించుటకు సిద్ధులైయుందురు. మహాసముద్ర ప్రయాణమునకు పడవ, తెప్ప, చాప, ఈత, యెట్టి సాధనములో అట్లే సంసారము సముద్రములో కాలు పెట్టే కాంతకు “శిక్షణ” అవసరము. ఆశిక్షణ సరియైన శిక్షణ అయివుండవలెను. అట్టిశిక్షణ లేనిచో సంసారనౌక సాగదు. సంసారములో ప్రవేశించిన కొద్దికాలమునకే స్త్రీ మాతృత్వము వహించుటకు సిద్ధముగా నుండును. విద్యా

వతియైన యెడల తన బిడ్డల నెట్లు పెంచవలెనో, భర్తయొద్ద యేవిధముగా సంచరించవలెనో, ఎట్లు నడచుకొనిన గృహకలహములు రాకుండునో, మొదలగునవి తెలుసుకొనుటయే గాక తన సంతానమును గూడ విద్యావంతులగా చేయును. నేటికాలములో కొంతమంది స్త్రీలు పాశ్చాత్య నాగరికత అవలంబించి ఆ విద్యకు దాసానదాసులై యుండిరి. కాని స్త్రీ విద్య అనగా సుశిక్షణ, పాతివ్రత్యము, వినయము, విధేయత, మొదలగునవి బోధించునది అందు స్త్రీ ముఖ్యముగా తన గృహస్థాశ్రమములో

శ్లో॥ కార్యేషు దాసీ, కరణేషు మంత్రీ, రూపే చలక్ష్మీః, క్షమయా ధరిత్రీ, భోజ్యేషు మాతా, శయనేచ రంభా, షట్కర్మయుక్తా కులధర్మపత్నీ॥

ఈ విధంగా నుండవలెనని మనపూర్వసాంప్రదాయము. విద్యావతియైన స్త్రీ తన బిడ్డలను చక్కగా పోషించి చక్కని నడవడి గలవారుగాను, విద్యావంతులుగాను, దేశసేవకులుగాను, తయారుచేయగలరు. ముఖ్యముగా తల్లియొక్క విద్యాబుద్ధులే ఆమె సంతానమునకు అబ్బునని పెద్దలు వచించెదరు. స్త్రీలు చదవరాదనే మూఢవిశ్వాసమును తొలగించండి. రాణి రుద్రమాంబ రాజ్యమును పాలించలేదా ? కదనరంగమున కాంతలకుకూడ వీరత్వమున్నదని ఋజువు చేయలేదా? నేటి కాలములో నాటకములు, నవలలు, ప్రబంధములు, రచించిన నారీమణులు లేరా? పూర్వము శ్రీకృష్ణుడు నరకాసుర సంహారములో సత్యభామచేసిన సహాయము నకు ఆశ్చర్యపోయెను. "వీణెయ బట్టనెరుంగనికొమ్మ బాణాసన మెట్లు పట్టనేర్చె, మ్రాకున దీగ గూర్పంగలేని కొమ్మ మంత్రశాస్త్రము లెన్నడభ్యసించె" నని యా సాత్రాజితియొక్క సాహసమున కచ్చెరువొందినాడు. "మాకు స్వరాజ్యం యిస్తే మేముకూడ కత్తికట్టి కక్షసాధిస్తామన్నారు" శత్రువును. ఈమధ్య మహిళామండలివారు చేసిన తీర్మానం యిది. సెబాస్: ఆంధ్ర లోకం గొడ్డుపోలేదు. ఆంధ్రపౌరుషం, ఆంధ్రవీరరక్తం, రుద్రమాంబ చూపిన రౌద్రరసం, ఆ క్షాత్రతేజం యింకా ఆంధ్ర నారీలోకంయొక్క రక్తనాడులలో ప్రవహిస్తోందని ఋజువైంది సెబాస్! అందుకోసమనే "ముదితల్ నేర్వగరాని విద్య గలదే ముద్దార నేర్పించినన్" అన్నారు సుకవులు. స్త్రీ విద్యలో గల దురభిప్రాయాలు మార్చుకొని తమ బాలికలను చదివించమని వినయపూర్వకముగా ప్రార్థిస్తున్నాను.

---

# ఇవి మీకు తెలియునా ?

(కోనూరు అచ్చయ్య)

1. అన్ని రాష్ట్రములలోను బెలూచిస్థానము తక్కువ జనసంఖ్య కలది.

2. ఇండియాలోని పురపాలకసంఘము లన్నిటిలోకి హైదరాబాదు పురపాలకసంఘము పురాతనమైనది. (1804 సం.)

3. స్వదేశసంస్థానము లన్నింటిలోను వైశాల్యములో జమ్ము, కాశ్మీరు సంస్థానములు పెద్దవి. జనసంఖ్యలో హైదరాబాదు పెద్దది.

4. హిందూ దేశమునకు ఉద్యానవనము కాశ్మీరు

5. గోరీలన్నింటిలోను టాజమహాల్ గొప్పది.

6. అజ్ఞానమును నశింపచేయువాడు గురువు.

7. ప్రాణము పోయినను మానవుని వదలనిది ఆశ.

8. సర్వప్రపంచమునకు భారతదేశమే కర్మక్షేత్రము.

9. కష్టనష్టములకోర్చి ఉపాధ్యాయుల మన్నలకు పాత్రమై అపారవిద్యా సేవచేయునది "ఆంధ్రరాష్ట్రప్రారంభవిద్య."

---

# మౌనపఠనము.

(అరసాడ భానుమూర్తి పట్నాయక్)

మౌనపఠనమనగా మనస్సులో చదువుట (సైలెంట్ రీడింగు) ఈమౌన పఠనమును 2 వ తరగతినుంచి ప్రారంభించవలెను. 2 వ తరగకిపైకి హెచ్చుగా చదివించుచు మనస్సులో తక్కుగా చదివించవలెను. (అనగా 6 : 4 ప్రబంధములో నుండవలెను.)

నిత్యజీవనములో బయటకు బిగ్గరగా చదువుటకంటె మనస్సులో చదువుట హెచ్చుగా నుపయోగించబడును. అందుచే నీయభ్యాసము పిల్లలకు ప్రత్యేకముగా కలుగజేయుటయందు పాఠశాలలయొక్క బాధ్యతయిప్పుడు గుర్తించబడినది. సాధారణముగా పైకిబాగుగ చదివినవారు మనస్సులోకూడ బాగుగ చదువగలరనట నిర్ధారించబడును. అందుచే పైకిచదువుట, రెండవది యగు సైలెంటురీడింగునకుత్రోవ. దీని నవసరమగు దృష్టిచలనము వృద్ధియగును. కాన యీ రెంటికిని గల సంబంధము ఉపాధ్యాయులు మరువరాదు. పెద్దతరగతులు (3, 4, 5, వగయిరా లో కూడ పైకి చదువుట అనేదానికి ప్రాముఖ్యము నిచ్చుట మంచిది కాదన్న మాట మరువరాదు. మౌనపఠనములో గ్రహణశక్తి హెచ్చుట నిశ్చయము.

**దీనిలాభములు:**—(1) వడిగాచదువ వచ్చును (2) అందుచేత హెచ్చుగ్రంథమగును (3) అలసటకు కారణముండదు (4) మనస్థైర్యము కుదురును (5) బడిలో నెమ్మదిగా పనిజరుగును. (6) బాలురకు స్వయముగా నేర్చుకొనుశక్తి కలుగును. (7) చదువుటయందాసక్తి వృద్ధియగును. (8) దృష్టిచలనము వృద్ధియగును. కాన దీనికి హెచ్చు ప్రాముఖ్యము నివ్వవలయును.

—♦ ఎందుకైనామంచిది జ్ఞాపకముంచుకోండి ♦—

I భూగోళములోనీరు 141,050,000 చ. మైళ్లు నేల 55500,000 చ॥ మైళ్లు గలదు. (మూడింట 1 వంతు నేల)

II. యూరపులో తోల్గా (24000 మైళ్లు) డాన్యూబు (1725 మై) రైను (800 మై) అను పెద్దనదులు మూడుగలవు.

III ప్రపంచమంతటిలో హెచ్చువర్షము కురియు ప్రదేశము" చిరపూంజి"

---

# విద్యార్జనము

శ్రీమాన్. కె వి. రంగాచార్య హారితస్

పూర్వకాలము పరిపూర్ణాఖిలైశ్వర్య
భూరి విభవ భరతభూమి, ప్రజలు
పాడిపంటల సుఖభాగులై సద్వృత్తి
గడుపుచుండిరి తమకాల మంతను
విద్యఁగఱప గురుల వినయాన సేవించి
చతురబుద్ధితోడ సర్వవేద
శాస్త్రకావ్యములను శాంతిమై వేదాంత
విషయమెల్ల నేర్చి విషయసుఖముఁ
గోరిధర్మపత్ని గురుని యానతిమీఁదఁ
గూర్చుకొంద్రు; నేఁడుకొంపదీయు
నాంగ్లవిద్యవచ్చె నద్దాని నేర్వగా
నాస్తిపాస్తులమ్మి యధములగుచు
నున్న చదువులన్ని యుద్యోగ వాంఛతోఁ
జదివి చదివి కడకుఁ జవటలగుచుఁ
జేతిపనులఁ జేయఁజేతఁగామిని కుంది
బిచ్చమెత్తలేక బిడియపడుచు
జీవితాశలేమి జీవించుటెట్లని
దుఃఖభాగులయి సుతులను, సతులఁ
బోషణంబుఁ జేయఁబూనలే కల్లాడి
ప్రాణమెట్లుపోవు వాంఛగంద్రు,
నయము-ఆధునిక సనాతన విద్యార్జ
నములనేది ? కారణము గ్రహింపు.

*

---

# కృషిపరిశీలన – ప్రశ్నోత్తరములు

( ఐదవ తరగతి )



By
తాతాజగన్నాధరావు హెడ్మాష్టరు, బోర్డు ఎలిమెంటరీస్కూలు, శొంఠ్యాం.
వేదుల అన్నయ్యశాస్త్రి, హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.

( 1942 సం॥రం మార్చినెల సంచికతరువాయి. )

3. విహారములవలన లాభములేమి ?

జః విహారముల వలన ప్రకృతి చిత్రములను ప్రత్యక్షముగా చూడగల్గుదురు ఒక వస్తువునకు మరియొకవస్తువునకు నెట్టిసంబంధముగలదో తెలిసికొనగలరు బాలురు తమ సహజ చాకచక్యమును, బుద్ధికుశలతను చూపగలరు సంచారములందు మంచిగాలి పీల్చుట, శరీరపరిశ్రమ లభించును చెడునడతలుపోయి అన్యోన్యానురాగము, ఉత్సాహము, చురుకుతనము, స్వయంకృషి, సమయానుకూలముగా ప్రవర్తించు శక్తిమొదలగు సద్గుణములు వాటి అంతట అవియే బాలురకలవడును

4. తోట డయిరీ అనగానేమి ?

జ. తోటపనియందును, విహారములయందును, బాలురు పరిశీలించిన విషయములను రోజువారీగా వ్రాసియుంచు పుస్తకమునకు తోటడయారీ అనిపేరు

5 తోట డయిరీయొక్క ఉపయోగమేమి ?

జః యిట్టిపుస్తకమును వ్రాయుచుండినచో విద్యార్థులకు క్రమమైన అలవాట్లు అలవడును. పరిశీలించిన విషయములను మరువకుండ జ్ఞప్తికితెచ్చుకొనవచ్చును ఉపాధ్యాయులీడైరీలను తరుచు చూచుచుండినచో విద్యార్థులు తమ పనిని ఎక్కువ జాగ్రత్తతో నిర్వహించుదురు. డైరీలోవ్రాసిన విషయములను ఎక్కువ విపులముగా వ్రాయుచుండినచో వ్యాసరచనా జ్ఞానము బాలుర కలవడును

6. ధాన్యము లెన్నివిధములు ? అవిఏవి ?

జః ధాన్యములు రెండువిధములు. 1 గింజధాన్యములు 2 కాయధాన్యములు.

గింజధాన్యములు: వరి, గోధుమ, జొన్న, మొక్కజొన్న, చోడి, గంటి, కొఱ్ఱ మొదలగునవి కంకులు లేక వెన్నులుండును.

కాయధాన్యములు: కంది, శనగ, మినుము, అలచంద, పెసర, ఉలవ, అనుము మొదలగునవి పువ్వులుపూసి కాయలుకాయును యివియే కాయధాన్యములు

7. యీ దిగువ పైరులనే యేమాసములలో పెట్టుదురు ? అవి ఏమాసమునకు ఫలించును ?

జొన్న, మొక్కజొన్న, వరి, గంటి, కంది, పెసర, మినుము, ఉలవ

| జః పైరుపేరు. | విత్తునెల | ఫలించునెల |
|---|---|---|
| జొన్న | సెప్టెంబరు | జనవరి |
| మొక్కజొన్న | జూన్ | సెప్టెంబరు |
| వరి | జూన్ | నవంబరు |
| గంటి | మే | ఆగష్టు |
| కంది | జూన్ | జనవరి |
| పెసర | సెప్టెంబరు | జనవరి |
| మినుము | సెప్టెంబరు | జనవరి |
| ఉలవ | సెప్టెంబరు | జనవరి |

8. కాయగూరలన నేమి ?

జ: పొట్ల, బీర, బెండ, కాకర, గుమ్మడి, ఆనప, బూడిదగుమ్మడి, దోస, వంగ, మిరప మొదలగునవి కాయగూరలు

9 వంగ, మిరపమొక్కలు బాగుగా ఫలించుటకు వలయు పరిస్థితులేవి ?

జ: వంగ, మిరప, చాల సున్నితమైనవి, వీనిని వేయు పొలములు మెరకగానుండి నీరు నిలువకుండా యుండవలెను ఒండ్రుసేలలు, ఎఱ్ఱనేలలు వీనికి మంచివి సిరు ధారగాపోయక నారుపై చిలకరించవలెను నెలరోజులనాటికి నారు ఊడ్చుటకు తయారగును వర్షము లేకపోయిన ఎండిపోవును. ఎక్కువగా వర్షము కురిసినచో కుళ్ళిపోవును

Syllabus Heading - Study of a few oil seeds

1 నూనెనిచ్చు గింజలేవి ?

జ: ఆముదము, నువ్వు, వేరుశనగ మొదలగునవి నూనె నిచ్చు గింజలు

2. ఆముదము, నువ్వు, వేరుశనగ పైరులనగూర్చి క్లుప్తముగా వ్రాయుము ?

జ: ఆముదము:- యీచెట్లకు అన్నిరకముల నేలలు పనికివచ్చును నాలుగైదు అడుగుల దూరమునకొక గింజచొప్పున వేయవలెను. దీనికి చీడపట్టుటగాని, నీరులేక ఎండిపోవుటగాని యుండదు. మొక్కలు బాగుగా విస్తరిల్లు వరకు నేలను బాగుగా త్రవ్వవలెను ఫిబ్రవరి మొదలు ఏప్రెల్ నెలాఖరువరకు కాయలు కాయును యీ కాయలు పగులుటకు సిద్ధముగా నున్నప్పుడు కోసి ఎండబెట్టుదురు

నువ్వు:- ఇది సుకుమారమగు మొక్క. చీడ ఎక్కువగా పట్టును దీనిలో రెండురకములుగలవు. కత్తెరనువ్వు, పైరునువ్వు, కత్తెరనువ్వు వేసవికాలములోను, పైరునువ్వు శీతకాలములోను పైరగును. కాయలు బాగుగా పండినపిమ్మట చెట్లను కోసి కళ్ళములలో 1, 2 రోజులు కుప్పగావేసి పిమ్మట విడదీసి ఎండలో వేయుదురు కాయలుపగిలి గింజలు బయటపడును

వేరుశనగ:- ఇసుక గరువులలోను, నల్లనేలలలోను వేయబడును. యిది నాలుగు నెలలపంట. జూలై మొదటిరోజులలో చల్లబడును. అక్టోబరు నెలాఖర్కు పంటపండి త్రవ్వుటకు వీలుగానుండును. కాయలు వేరునకుండును గాన దీనికి వేరుశనగయని పేరువచ్చెను. (సశేషము)

---

# ఉపాధ్యాయుడు

(అరసాడ భానుమూర్తి)

హిందువుల జన్మభూమి హిందూదేశము. భారతీయుల భాగ్యదేవత భరతభూమి. సత్యహరిశ్చంద్రుడు, శ్రీరాముడు, పాండవులు హిందువులు మొదలగు పుణ్యమూర్తు లవతరించిన పుణ్యభూమి.

శివాజీ మొదలగు మహావీరులు, రాజనీతిపారంగతలై రాజ్యమేలిన తారాబాయి, యహల్యాబాయి, రుద్రమదేవి, మొదలగు రాణులు, బుద్ధుడు, శంకరుడు, రామానుజాచారి మొదలగు మతకర్తలును వరాహమిహరాది శాస్త్రజ్ఞులును, కాళిదాసాది మహాకవులును, రామకృష్ణ పరమహంస, స్వామివివేకానంద, మొదలగు జ్ఞానవంతులు, మున్నగు వారెందరెందరో మన దేశమున వెలసియుండిరి. ఎందరు మహానుభావులు పుట్టిగిట్టిరో యీ పుణ్యభూమిని ప్రస్తుతము గాంధీ మహాత్ముడు, మొదలగు వారు జన్మించియున్నారు.

ఈ పవిత్ర భూమిని పుట్టిన మహాను

భావులందరు పుట్టుకతోడనే అంతటి ఘనత వహించలేదు. విద్యాభ్యాసమునకు రాగానే గురువులయొద్ద మంచి శిక్షణను పొంది విద్యావంతులై చక్రవర్తులుగను, రారాజులుగను, జమీందారులుగను, పరిపాలనాకార్య నిర్వాహకులుగను, శాసన నిర్మాణ సభ్యులుగను, దండనాధికారులుగను, న్యాయాధిపతులుగను, న్యాయవాదులుగను, పరీక్షకులుగను, ఉపన్యాసకులుగను, పత్రికాధిపతులుగను, వ్యాపార ప్రవీణులుగను, చిత్రనిర్మాణకుశలులుగను గాయకులుగను, జ్ఞానవంతులుగను, బోధకులుగను నగుచు ప్రసిద్ధిని గాంచుచున్నారు.

ఇట్టి ప్రసిద్ధిపొందుటకు ప్రధమసోపానము, మార్గదర్శకుడు, ప్రాధమికోపాధ్యాయుడే ! ఇట్టి ప్రాధమికపాఠశాలలకు తగు ప్రోత్సాహమొసంగి మన మాతృదేశమును విద్యాదారిద్ర్యమునుండి విముక్తినొందించెదరు గాక !

---

ఓం

# బాలుర కుపయుక్తమైన నవరత్నమాల.

(రచయిత : చిల్లరిగె వెంకటరమణయ్య)

సీ. తల్లిదండ్రులమాట ♦ తగుశ్రద్ధతో । నాల । కించి శీఘ్రమె యాచ ♦ రించవలయు ।
తల్లిదండ్రులనెప్డు ♦ దైవంబురీతి భా । వించి వారల నాద ♦ రించవలయు ।
తోఁబుట్టువులగాని ♦ తోడివారలగాని । మించిన ప్రేమఁ బా ♦ లించవలయు ।
నిజమైనమాటలే ♦ నేర్పుగా మాట్లాడి । నిత్యసత్కీర్తితో ♦ నెగడవలయు ।
ఆ. వె॥ తాముగూడఁబెట్టి ♦ తమపొట్టకేతిని । తనివిబొందియుండు ♦ దానికంటు ।
శక్తికొలదిబీద ♦ జనులకు మేల్సేయ । చాలకీర్తికాదె ♦ బాలులార॥ ౧
ఆ. వె॥ బడికిఁబోయిమీరు ♦ బహుభక్తితోడమీ । బోధకునకుబుద్ధి ♦ పూర్వకముగ।
దండమిడుచువారి ♦ దయను సంపాదింప । మేలుగల్గుమీకు ♦ బాలులార॥ ౨
సీ. తోడిబాలురనెప్డు ♦ పీడింపగారాదు । చెనటులతోఁ జెల్మి ♦ సేయరాదు ।
పెద్దవారలఁగాని ♦ పిన్నవారలఁగాని । కొంచెమైనను వెక్కి ♦ రించరాదు ।
వీధులవెంబడి ♦ వే, బరుగిడరాదు । ఆటలనైనఁ బో ♦ ట్లాడరాదు ।
మురికిబట్టలమీరు ♦ ముట్టనేకూడదు । విగతవస్త్రంబుగా ♦ వెడలరాదు ।
గీ॥ ఆటలందైన బొంకుల ♦ నాడరాదు । పాటలందైన బూతులు ♦ పల్కరాదు ।
కాలమీరీతిఁ గడుపంగ ♦ శీలమొదవు । బాలులార! సుబుద్ధివి ♦ శాలులార॥ 3
సీ॥. అల్లరిమూఁకతో ♦ సంగళ్లకును బోయి । యనవసరపు బేర ♦ మాడరాదు ।
కుంటివారలఁగాని ♦ గ్రుడ్డివారలఁగాని । కాంచి వారిఁ బరిహ ♦ సించరాదు ।

మిత్రులయెడఁగాని ♦ శత్రులయెడఁగాని । మోటుతనంబుగా ♦ మూఁగరాదు ।
తలుపులఁ బడదన్ని ♦ తారుమారుగ బొబ్బ । లిడుచు నమర్యాద ♦ బడయరాదు ।
గీ॥ వృద్ధులగు బాటసారుల ♦ వీలువెంట । నుపకృతి యొనర్చి ♦ పూజింప నొప్పుగాని ।
కనికరములేక దూషింపఁ ♦ గడఁగరాదు । బాలులార! సుబుద్ధివి ♦ శాలులార॥ ౪

ఆ. వె॥ భాగ్యవంతులైన ♦ ప్రభువులయినవారి । యిండ్లకడకు మీఱ ♦ లేగరాదు ।
పిలువకుండఁబోవ ♦ పలుచదనంబౌను । బాలులార! బుద్ధి ♦ శాలులార॥ ౫

సీ. ఉదయంబునకుఁ బూర్వ ♦ మోపికతో లేచి । విణ్మూత్రముల వేగ ♦ విడువవలయు
అటుపైని ముఖమున ♦ దిటవుగా క్షాళించి । చక్కఁగా స్నానంబు ♦ సల్పవలయు ।
తరువాత కేశముల్ ♦ తగినట్లుగా దువ్వి । బొట్టు నందముతోడఁ ♦ బెట్టవలయు ।
నామీఁద భుజియించి ♦ యమలవస్త్రంబుల । ధరియించి బడివేళ ♦ కరుగవలయు ।

ఆ. వె॥ నీప్రకార మెపుడు ♦ నేబాలకుడు చేయు । వాడె వన్నెకెక్కు ♦ వసుధలోనఁ ।
గాన మీరలిట్లు ♦ కడగి వర్తింపుడో । బాలులార! బుద్ధి ♦ శాలులార॥ ౬

సీ॥ చెప్పిన పాఠమ్ము ♦ లొప్పుగా వల్లింప । మీయుపాధ్యాయుండు ♦ మెచ్చుచుండు ।
స్కూలు నిబంధనల్ ♦ వీలుగా గమనింప । మీటీచరెప్పుడు ♦ మేలు సేయు ।
నొకరి పలకఁ జూడఁ ♦ గొక తప్పు లేకుండ । శక్తిగొలది వ్రాయ ♦ సరసమౌను ।
బల్లలపైగాని ♦ బడిగోడపైఁగాని । పిచ్చిగీతలు గీయ ♦ పేలవంబు ।
గీ॥ బొగ్గు మొదలైనవానితో ♦ బొక్కులోన । గుర్తుకల్పించి వ్రాయుట ♦
కూడదెపుడు । ఒకరిమీఁదను చాడీల ♦ నొకరు చెప్పి । శిక్ష చేయించ తగదు
సు ♦ శీలులార॥ ౭

ఉ॥ ఎత్తరినైన పెద్దలను ♦ నేయధికారులనైనఁ జూచితా ।
మత్తరి యూరకుండఁదగ ♦ దామహనీయులు మెచ్చునట్లుగా ।
'చిత్తము, బాబు,' తాము దయ ♦ సేయుడటంచును బల్కఁగాఁదగున్ ।
మెత్తనిమాట లెప్పుడును ♦ మేలొనరింపవె యెట్టివారికిన్॥ ౮

క॥ తనవలె నితరులఁ జూచెడు । ఘనునకు నెన్నడును జెఱుగు ♦ కాబోదు సుమీ ।
తనవలె నితరులఁ జూడని । మనుజునకే కల్గుచుండు ♦ మరిమరి కీడుల్॥ ౯

# సివిక్సు - ప్రశ్నోత్తరములు.

## నాల్గవ తరగతి

1942 సం॥రం మార్చి నెల సంచికతరువాయి.



By
తాతాజగన్నాధరావు హెడ్మాష్టరు బోర్డు ఎలిమెంటరీస్కూలు శొంఠ్యాం.
వేదుల అన్నయ్యశాస్త్రి హెడ్మాష్టరు బోర్డుఎలిమెంటరీస్కూలు, గురమ్మపాలెం.

13. దేహపరిశ్రమయొక్క ఆవశ్యకమేమి ?

జ: దేహపరిశ్రమ చేయనియెడల బద్ధకముహెచ్చి, బుద్ధితగ్గి, శరీరబలముతగ్గి, దేహము అనారోగ్యవంతమగును.

14. శరీరవ్యాయామము వలన గల్గు లాభములేమి ?

జ: నిత్యము శరీరవ్యాయామము చేయుచుండినచో శరీరబలము హెచ్చి, ఉత్సాహముగల్గి, బుద్ధిబలముహెచ్చి, ఆరోగ్యముగానుందురు.

15. విశ్రాంతియొక్క అవసరమేమి ?

జ: శరీరమందలి అవయవములు నిత్యము పనిచేయుటలో అరుగుదలనై, మలినమేర్పడి నీరసముజెందును. మనమిచ్చు ఆహారాదులవలన ఆతరుగుదలను పూర్తిచేసుకొని, మలినమును బోగొట్టుకొని మరలబలము చేకూర్చుకొనుటకు మనము కొంత విశ్రాంతి అవయవముల కొసంగవలెను. అట్లు విశ్రాంతి యొసగకపోయినచో శరీరబలము స్వల్పకాలములో క్షీణించి మరణము తటస్థించును.

16. నిద్రయొక్క విలువను వర్ణించుము ?

జ: నిద్రవలన దేహమందలి మాంసకండరములకును, మెదడునకును గొప్ప విశ్రాంతి కలుగును. రోగులకును, వృద్ధులకును, పసిపిల్లలకును ఎక్కువ నిద్రకావలెను. నిద్రపోవునపుడు మనము భుజించిన ఆహారము జీర్ణమై రక్తములోకలిసి శరీరమునకంతటికి వ్యాపించి శరీరాభివృద్ధికి తోడ్పడును. వయసునుబట్టి నిద్ర పరిమితియుండవలెను.

17. సూక్ష్మజీవులనగానేమి ? వాటివలనగల్గు నష్టములేవి ?

జ: సూక్ష్మజీవులనగా కంటికి కనుపించక, యంత్రసహాయము వలన మాత్రమే కనిపెట్టగల్గిన అణువులవంటి ప్రాణులు. తేమ, కల్మషము, దుర్వాయువు మొదలగు యీ సూక్ష్మజీవులకు ప్రధానస్థానములు యిపిగాలిలోను, నీటిలోను, పదార్థములలోను యుండును. వీటిలో కొన్నిరకములు మనశరీరములో ప్రవేశించి, వృద్ధియై, అవయవబలమును క్షీణింపచేసి రోగములను కల్గించును.

18. సూక్ష్మజీవులెవరి సహాయమున వ్యాపించును ?

జ: ఈగలు, బొద్దీగలు, ఎలుకలు, పిల్లులు మొదలగు వాటివలన సూక్ష్మజీవులు మనభోజనపదార్థములు, వస్త్రములు, శరీరములపై వ్యాపించును.

19. సూక్ష్మజీవుల వ్యాప్తి నరికట్టుట యెట్లు ?

జ: శరీరమును ఆరోగ్యముగా నుంచుకొనుటయు, మన గృహపరిసరములయందు తేమ, కల్మషము, విషవాయువులను చేరనీయ కుండుటయు, పరిశుభ్రమగు గాలి, వెల్తురు మనకును, మనవస్తువులకును తగులనిచ్చుటయు, కాచి వడబోసిన నీటిని త్రాగుటయు, మూతలుంచబడిన ఆహారపదార్థములనే భుజించుచుండుటయు, యితరులు విసర్జించిన వస్త్రములను ధరించకుండుటయు, అంటురోగులదరికి జేరకుండుటయు మొదలగు నియమములను ఆచరణలో బెట్టినచో సూక్ష్మజీవుల వ్యాప్తి నరికట్టగలను.

20. అంటువ్యాధులన నేమి ? నాల్గింటిని పేర్కొనుము ;

జ: అంటువ్యాధులనగా ఒకరినుండి ఒకరికి వ్యాపించు రోగములు మశూచికము, కలరా, గజ్జి, తామర మొదలగునవి సామాన్య అంటురోగములు.

21. గృహమును పరిశుభ్రముగ నుంచుటలో నీవెట్టి శ్రద్ధ గైకొందువు ?

జ: ఇండ్లకు గాలియు, వెల్తురు ధారాళముగా రావలెను. ఇంటిచుట్టును స్థలము విశాలముగా నుండవలెను. నిత్యము యింటిని తుడుచుచు, శుభ్రముగ తరుచు కడుగుచుండవలెను. ఇంటియందెట్టి కల్మషములను యుంచరాదు. గోడలకు తరుచు వెల్ల వేయించి, అందమగు మంచి పటములతో గోడల నలంకరించవలెను.

22. శుభ్రముగా నుండుటకు గమనింపవలసిన విషయములెవ్వి ?

జ: పెందలకడనే నిద్రనుండిలేచి, కాలకృత్యములను దీర్చి, స్నానముచేసి, పరిశుభ్రమగు దుస్తులను ధరించి, మితముగా నియమిత కాలములయందుభుజించి, తలను బాగుగా దువ్వుకొని, కల్మష స్థలములలో సంచరించుటమాని, దుర్మార్గుల సహవాసము వీడి, సత్ప్రవర్తనగల వారమై యున్నచో శుభ్రత కలవాటుపడుదుము.

23. శరీరమెట్లు మురికియగును ? అందువలన నష్టములేమి ?

జ: గాలిలోని ధూళివలనను, చర్మమునుండి వెడలు చెమటవలనను శరీరము మురికియగును. శరీరమును శుభ్రముచేసికొననియెడల మురికివలన దుర్వాసన బయలుదేరి, సూక్ష్మజీవులు శరీరముపై చేరి, గజ్జి, తామర మొదలగునవిగల్గి శరీరసౌఖ్యముతగ్గి, నిరుత్సాహము హెచ్చును.

24. నిత్యము స్నానముచేయుటవలన గల లాభములేవి ?

జ: నిత్యము శుభ్రమగునీటిచే స్నానముచేయుటవలన దేహము ఆరోగ్యముగా యుండి, ఉత్సాహము, బుద్ధిబలము, జీవితకాలము, తేజస్సు హెచ్చును.

25. దుస్తుల శుభ్రతపై శరీరారోగ్య మెట్లా ధారపడియున్నది ?

జ: దుస్తులను తరుచు నీటిలోఉతికి, మురికిని పోగొట్టి, సూర్యరశ్మిలో ఎండవేసినచో సూక్ష్మజీవులు, చెమట హరింపబడును. యితరులు కట్టి విడచినదుస్తులద్వారా వారికున్న గజ్జి, తామర మొదలగు రోగము లితరులకు వ్యాపించును గాన అట్టివి ధరించరాదు. ( సశేషము )

---

# తెనుఁగు తల్లి

(పాట)

కవిరాజ శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తికవి

తెనఁగుదేశమే నాదేశమ్ము - తెనుఁగుపల్కులే నాదుపల్కులు
తెనుఁగునపాత్తము లెన్నోకలవు - తెనుఁగునఁగల రుచి తెలిసినది
తెనుఁగుగౌరవము తెలిసినది.
నన్నుకన్నది తెనుఁగుతల్లియే - నన్నుపెంచినది తెనుఁగుతల్లియే
ఎన్నడునాపై దయతోనుండెడు - తెనఁగుతల్లికే మ్రొక్కెదను
మ్రొక్కెదనమ్మ మ్రొక్కెదను.

---

# ఇంగ్లీషు నెలలు - రోజులు

కవిరాజ శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తికవి

కం. ఇరువదియొనిమిది ఫిబ్రే - వరిదినములు; జూనుకు నవంబరు సెప్టెం
బరు ఏప్రెలులకు ముప్పది - ధర ముప్పదియొక్కటేసి ♦ తక్కిననెలలన్.
కం. సరిగను నాలుగుచేతను - హరియింపం బడినయట్టి ♦ యాంగ్లేయపు వ
త్సరసంఖ్య గల్గు ఫిబ్రే - వరి కిర్వదితొమ్మిదేసి ♦ వచ్చును దినముల్.
కం. ఇరువది యొనిమిది ఫిబ్రేవరిదినములు, హెచ్చుదినము ♦ వచ్చెడుసంవ
త్సరమున నిరువదితొమ్మిది మరువకు నాల్గేండ్లకొక్క ♦ మారదివచ్చున్.

---

# గాంధిమహాత్ముడు - పాట

పసుపులేటి రామకోటయ్య.

("తల్లినిమించిన దైవమువేరే ధారుణిలేదోయీ" అనువూదిరి)

1. గాంధివంటి మహాత్ముఁడిలలో - కానగరాడోయీ
అహింసయే తనవ్రతముగనెంచిన - ఆదర్శకుఁడోయీ॥ గాం॥
2. సత్యమేజయమను - సాధనగలిగిన
సాధుపుంగవుడురా - శాంతిముఖమురా
కష్టము సుఖమూ - ఒకటిగచూచిన
కరుణాళుడేరా
మాతృభూమికి ముదమునుగూర్చిన సేవాపరుడేరా॥ గాంధి॥

---

# తోటలకు కలుగు అపాయములు

వేదుల సూర్యనారాయణశాస్త్రి

1. కలుపుమొక్కలవలని బాధ :— తోటలో కలుపుమొక్క లుండకూడదనే సంగతి అందరు ఎరింగినదే! అవి మొలచిన తోడనే చూచుట కేవల మసహ్యమే కాకుండ అసలు అభివృద్ధినొందవలసిన మొక్కకు సరిపడునంత ప్రదేశము ఉండనీయక తామే ఆక్రమించుకొని, దానికి కావలయు ఆహారము, గాలి, నీరు, వెలుగు, తేమ మొ॥ వి॥ దొరుకనీయవు. మరియు ఆ కలుపుమొక్కలు సంపూర్ణముగా పెరుగుటయె సంభవించెనేని అవి క్రమముగా పుష్పించి విత్తనములను వ్యాపింపజేసి తోటనంతటిని ఆక్రమించును. తోటయందు మనము పెంచు మొక్కల యాహారమును ఈ మొక్కలే మ్రింగివేసి అసలు మొక్కల నణచును.

## కలుపు మొక్కలు వ్యాపించు విధము

(1) ఆయా ప్రాంతములందున్న బీడు భూములలోని కలుపు మొక్కల నుండి గాలిచే లెగురగొట్టబడిన విత్తనములు ప్రవేశించి కలుపు బయలుదేరుట నవకాశములు కలుగును. కాన తోటకు సమీపములో అనవసరమగు తుప్పలు, గడ్డి బీడులు, లేకుండునట్లు చేయవలయును.

(2) మనము చల్లు గింజలలోనే యా కలుపుమొక్కల గింజలుండవచ్చును. కాన చల్లుటకు ముందు విత్తనములను సరీగా పరీక్షించవలెను.

(3) ద్వివార్షికపు మొలకల యందు, బహువార్షిక మొలకలయందును, ఉండు కలుపు మొక్కలు కొన్ని భూమియందే అణగియుండు కొన్నిదుంపలవలన అభివృద్ధి జెందగలవు గావున భూమిని బాగుగా, లోతుగా, త్రవ్వవలయును. అందుచే కలుపుమొక్కలు నశించగలవు.

(4) భూమియందలి సారము తగ్గినపుడు కూడ కొన్నిజాతుల గడ్డి మొలకలు మొలచును. భూమికి మంచి ఎరువు వేసినపుడు అట్టి మొక్కలు నశించును. తొలకరి వర్షము కురిసిన తరువాత మొదట గడ్డిని మొలవనిచ్చి తరువాత నేలను దున్ని యా మొలకను పారవేయుటవలన వానిని నాశనము చేయవచ్చును.

## క్రిమికీటకాదులవలన సంభవించు అపాయములు

1. మొక్కల శత్రువులు:-చిలుకలు, పక్షులు, ఎలుకలు, పసరములు మొ॥ పెద్దజంతువులనుంచి సంభవించు అపాయములకన్న సస్యములకు కీటకములవలన యెక్కువ కీడు కలుగును. అందులో కొన్నిటిని వ్రాయుచున్నాను. (1) చీడల్పు కీటకములలో కొన్ని గుడ్లు పగిలిన తరువాత రెక్కలులేని పురుగులు పుట్టును. ఈడింభదశయందు యివి ఎక్కువ యాకలికలవియై పచ్చని యాకులను భక్షించును (ఉ॥ కంబళిపురుగులు మొ.) మిడుతలు కూడ సస్యములకు నష్టముకలిగించును.

(2) వత్సపురుగులు:—ఇవి మొక్కల వేళ్ళను కొరికి పాడుచేయును. రోకలిబండ, జమిడి, లద్దిపురుగు, జలగపురుగు, నత్త,

యివి వేళ్ళదగ్గిరచేరి వేళ్ళనకొరికి మొక్కలను చంపుచున్నవి.

(3) ఎఱ్ఱసాలీడు:—యిది చాల చిన్నదిగాయుండే ఆకుల అడుగునజేరి గూడుగా ఆకులనకట్టి అభివృద్ధి నరికట్టుచున్నది.

(4) తెగుళ్లు:- శిలీంద్రములనెడి యొకమాదిరి జీవములచే తెగుళ్ళు గలుగుచున్నవి. కాటుక తెగులు జొన్నచేలకును, చెరకుతోటలకు ఎఱ్ఱతెగులున్ను వీనివలననే కలుగుచున్నవి.

(5) ఆకుపేను, బెరడుపేను:— అను యివి లేతమొలకల కాండములను తినివేయును. మరియు యింకను ఆయామొక్కలను పాడుచేయు కీటకము లనేకములు గలవు.

## పక్షులవలని సంభవమగు కీడులు, మేళ్లు

సామాన్యముగా తోటలను పైరులను దర్శించుచుంటిమేని పక్షులను గుర్తించు పరీక్షించినచో వానియందు అనేకములు చేసెడి నష్టముల కన్న మేళ్ళు ఎక్కువగా కనబడుచున్నవి. వీనియందు కొన్ని ముఖ్యముగా పైరును పాడుచేయు పురుగులనే తినను. అందుచే నివి వ్యవసాయదారుని మిత్రులనవచ్చును.

1. ఊరపిచ్చుక:—ఇది ధాన్యాదులను తినునుగావున నష్టముగలిగించుపక్షి. అయినను సస్యములకు నష్టము కలిగించు ననేక పురుగులను తినుచుండుటవలన వ్యవసాయదారునకు చేయు నష్టముకన్న లాభమే కలిగించుచున్నది.

యిటులనే వానకోయిల, మందపిచ్చుక మొదలగునవికూడ లాభకారులే.

## చీడపురుగులు, వ్యాధులు వానిని నివారించు మార్గములు

(1) నేలనుబాగుగా తయారుచేయుట:- ముందు నేలను లోతుగాదున్ని కలుపు మొక్కలను తీసివేయవలయును. లోతుగా దున్నినందువలన మిడుతలు మొదలగునవి భూమియందు పెట్టిన గ్రుడ్లు పైకివచ్చి ఎండచేచచ్చును. కొన్నిరకములకీటకములు గూడచచ్చును. కలుపుమొక్కలను తీసివేయుటవలన వానియందుండే కీటకములు చచ్చును. మొక్కలకు కావలయు ఆహారము, తేమ నశించదు. కలుపు మొక్కలను పోగుచేసి తగులబెట్టుట మంచి మార్గము.

(2) పైరులు మార్చుపద్ధతి:— దీని మూలమున ఒకపైరుకుపట్టు పురుగులు వేరొకపైరుకు పట్టవు. అట్టి పురుగులు తమకు కావలసిన యాహారము లభింపమి చచ్చును.

(3) నీరుపోసి ఎరువుచేయుట:— నీరు ప్రవహించుటవలన నేలయందు దాగివున్న మిడుతలు, ఈలకోళ్లు, కీచురాళ్లు బయటికి వచ్చి కాకులు, గ్రద్దలచే భ్రమింగబడును. మంచి యెరువువలన పైరు బాగుగాపెరిగి సామాన్యపు తెగుళ్ళకు లొంగదు.

(4) సాధనములతో నిర్మూలించు పద్ధతి:—కొందరు కఱ్ఱలకు వలసంచులను గట్టియు, బోనులను ఉపయోగించియు, కీటకములను, పురుగులనుచంపివేయుదురు. మొక్కలకుపట్టినచీడ ప్రారంభావస్థయందే చీడబట్టిన యాకులనుగాని లేదా యాకొమ్మలనుగాని నరకి పారవేయుటమూలమున దీనిని వ్యాపింపకుండ చేయువచ్చును.

తోటచుట్టును కందకముల త్రవ్వుటవలన ప్రాకే గొంగళిపురుగులను ఆటంకపరుప వచ్చును. మిడుతలు మొదలగునవి వచ్చినపుడు మంటలు వేయుటవలనను పొగ పెట్టుటవలనను కొంతవరకు నశింపచేయ వచ్చును.

(5) మందునీరును చల్లుట:- లేత మొక్కలను తిని వేయు బెరడు పేను, ఆకు పేను, పచ్చపురుగు మొదలగు వానిని నశింపచేయుటకు ద్యాన వనములందును, కూరగాయల తోటలందును, పొగాకు నీటినిగాని కిరోసిను, సబ్బు కలిపిన నీటినిగాని చల్లుట మంచిది.

---

## రామగోవిందాపురము (కనిగిరి తాలూకా) హిందూప్రాథమికోన్నత పాఠశాల డిబేటింగు సొసైటి.

# దశమ వార్షికోత్సవము (1941 - 42)

పై సంఘముయొక్క దశమవార్షికోత్సవము తే 20-5-42 ది సాయంత్రము 4 గంటలకు సదరు స్కూలుభవనమునందు జరుపబడెను. తత్సభకు కనిగిరి రేంజి స్కూళ్ల సీనియర్ డిప్యూటి ఇన్స్పెక్టరువారగు మహారాజశ్రీ యు సత్యనారాయణ చౌదరి బి.యె. బి.యిడి. గారు దయతో అధ్యక్షత వహించిరి. పరిసర గ్రామములనుండియు కనిగిరినుండియు, అనేక ప్రముఖులు విచ్చేసిరి. అధ్యక్షులవారికి పంచరత్నములొసంగబడెను.

సభ దైవప్రార్థనతో ప్రారంభమై ఆద్యంతమువరకు జయప్రదముగా జరిగెను. కనిగిరినుండి మా యాహ్వానమంగీకరించి విచ్చేసిన గవర్నమెంటు ట్రైనింగుస్కూలు టీచరువారగు మహారాజశ్రీ వి. నాంచారయ్యగారు "విద్య దానిప్రాముఖ్యము" ను గూర్చి వుదాహరణములతో నేట తెల్లముగ తెలియునట్లు ఉపన్యసించుచు, పౌరులు ఉపాధ్యాయులకు విద్యావ్యాప్తి విషయములలో తోడ్పడవలయుననియు నొక్కి వక్కాణించిరి. ఈ పాఠశాలాభివృద్ధికి మ్యానేజరుగారి వుదారత్వమే కారణమని నుడివిరి. కనిగిరినుండి వచ్చిన ప్రేక్షకులలో నొకరగు బాలకవికే. రంగయ్యగారు పౌరుల నాశీర్వదించుచు ఆశుకవనము చెప్పిరి.

8 వ తరగతి విద్యార్థులు, మ్యానేజరు తమకు తల్లిబిడ్డకువలె దయతో విద్యాభివృద్ధికి తోడ్పడి వారు చేయుచున్న కృషికై కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించిరి. పాతవిద్యార్థులలో నొకరగు జి యల్లమందారెడ్డి తాను చదువుచున్న ఉన్నత విద్యాభివృద్ధికి యీ పాఠశాలయందలి విద్యాబోధనా పటిమయే కారణమని నుడివెను. 8 వ తరగతి విద్యార్థులు తమకు తెలుగువాచకమును సులభముగను, శాంతముగను, బోధించినందులకు శ్రీ. చివుకుల లక్ష్మీపతిశాస్త్రి బి. యె. గారికి తమ వందనము లర్పించిరి.

మ్యానేజరుగారు, 8 వ తరగతి ముగించి స్కూలు వదలి వెళ్లు విద్యార్థులకు హితోపదేశములు పలుకుచు, బాలురు తమ్ముగూర్చి శ్లాఘించుటకంటె, వారు సత్యవర్తనము వల్లను, విధ్యుక్తధర్మ నిర్వహణమువల్లను, పేరుపొంది తద్వారా తమకు కీర్తిని గడించినయెడల తాము సంతసింతుమనియు, తమపని కృతార్థత చెందుననియు, నుడివిరి.

ఒంగోలు మ్యునిసిపల్ హైస్కూలు ఆంధ్రపండితులైన శ్రీ కోట వెంకటేశ్వర శాస్త్రిగారు సంస్కృత భాషా ప్రాశస్త్యమును గూర్చి భాషింపుచు కొన్ని చాటువుల నుదహరించి యీ పాఠశాలలో ఉడుతభక్తి రీతినైనను సంస్కృతమును నేర్పయత్నము సలుపవలెనని నుడివిరి.

పోటీపందెములలోను, విద్యావిషయములలోను, గెలుపొందినవారికి బహుమతు లొసంగబడెను.

అధ్యక్షులవారు అంత్యోపన్యాసములో విద్యవలని ఫలితములగూర్చి విశదీకరించుచు, బాలురకు విద్యార్థిదశలోనే మతకలహములు లేకుండునట్లు ఐక్యభావ తలంపునకు పునాదివేయవలసినదిగా సలహా నొసంగిరి. పౌరులకు సలహా నొసంగుచు తమ బాలికలను గూడ పాఠశాలకు పంపి జ్ఞానవతులుగ జేసి భారతమాతకు సుపుత్రికలగునట్లు సహాయమొనర్పుడని నుడివిరి. ఈ పాఠశాల మ్యానేజరు, విద్యాభివృద్ధికి చేతిపనులు మొదలగు అనేకవిషయములందు బాలుర పురోభివృద్ధికి చేయుచున్న కృషికితోడు సంగీతము నేర్పుటకు ఒక యుపాధ్యాయుని ని, నియమించిన అన్నివిషయములందును వన్నెతెచ్చినవారగుదురని నుడివిరి.

అల్పాహారముతోను జాతీయ గీతములతోను నాటి సభ ముగింపబడెను.

రాత్రి 9 గంటలకు బాలుర చే "లవ-కుశ" డ్రామా ప్రదర్శింపబడెను.

డిబేటింగ్ సొసైటీ
హిందూ ప్రాథమికోన్నత పాఠశాల
రామగోవిందాపురము
(కనిగిరి తాలూకా)
తేది 21—5—42.

ఇట్లు,
పి. సత్యనారాయణ
కార్యదర్శి.

---

# ఆంగ్లభాషా బోధనము

(సంపాదకుడు)

ప్రస్తుత విద్యావిధానములో దేశీయ భాషలకెంతటి ప్రాముఖ్యముగలదో అంతటి ప్రాముఖ్యము ఆంగ్లభాషకును గలదు. మన దేశములో ఆంగ్లేయ పరిపాలనము స్థిరపడినప్పటినుండి యీ భాష రాజభాషయై చక్కని కుదురేర్పఱచుకొని అను దినాభివృద్ధి నొందుచు నానాముఖములవి స్తరించి భారతజాతిని శాశ్వతముగా గుత్తకుగొన్నరీతి వికాసించుచున్నది. ఇందుల కనేక కారణములుగలవు. న్యాయస్థానములందును, శాసనసభలలోను, పరిపాలనాక్రమమునందును, ఇది వ్యవహారిక

భాషగా పరిగణింపఁబడుచున్నది. అంతేగాక వర్తక వ్యాపార విషయములందు ఇది అంతర్జాతీయభాషగా వాసికెక్కినది. కావుననే దీనికింతటి ప్రాముఖ్యము గల్గినది. నేడు మన దేశీయులలో ఎంత మాతృభాషాభిమానముగల వారైనను సరే - ఆంగ్లపదమున నుపయోగింపకుండ మాట్లాడఁగల వారొక్కరైనను ఉండరనుట సాహసోక్తి కానేరదు. దేశభాషలలో ఆంగ్లపదజాలము మెండుగా నిండుకొన్నది. ఆంగ్లభాషరానివాఁడు నేడు విద్యావంతుఁడని యెన్నఁబడఁడు.

నేఁడు యావత్ప్రపంచమునంగల వివిధ భాషలలో ఆంగ్లభాష మిక్కిలి సారస్వతముతోఁ బ్రకాశించుచున్నది. ఇంత పెద్ద వాఙ్మయము కలదు కాబట్టి దీనిని విజ్ఞానము కొఱకుగూడ చదువవలసియున్నది. తన మాతృభాషలో పండితుఁడైనవాఁడు దీనిలోను తగినంత పాండిత్యమును సంపాదించెనేని చక్కగా రాణింపఁగలఁడు. ఇందులకు రవీంద్రకవి చంద్రుడే సాక్షి. ఒక్క సారస్వత విజ్ఞానముకొఱకేగాక రెండుభాషలు మాట్లాడు దేశములలో (Bilingual countries) ఆంగ్లభాష పరస్పరభావ ప్రకటనమునకుఁగూడ నభ్యసింపబడుచున్నది. మనము విదేశములకు వెళ్ళుదుమేని ఆంగ్లమే మనకు జీవనోపాధి ఇదిలేనినాఁడు విదేశగమనమేలేదు. కాబట్టి నేటిపరిస్థితులంబట్టి మనకు నాంగ్లభాషాభ్యసనము తప్పనిసరియగుచున్నది. అయితే ఎట్టిపద్ధతి నవలంబించిన మన విద్యార్థులకీ భాషనుసులువుగా మాట్లాడను, వ్రాయను, నేర్పఁగలుగుదుమో విచారింతము.



తొలుదొల్త అన్యభాషలను తర్జుమా పద్ధతి (Translation Method) బోధించుచు వచ్చిరి. కానిమానసికతత్త్వశాస్త్రము బాగుగా పెంపొందిన తర్వాత దీనిలోని లోపములు తెలియవచ్చినవి. ఈ పద్ధతి నవలంబించినచో నుపాధ్యాయుఁ డెక్కువ కాలము మాట్లాడవలసి యుండును. విద్యార్థులు ఊరకవినుచుండవలెను. ఎక్కువ కాలము గురుశిష్యులు మాతృభాషలోనే మాట్లాడవలసియుండును. కాబట్టి యేవిషయమునైనను విద్యార్థి ముందుగా మాతృభాషలో నూహించి దానిని మఱల నాంగ్లములోనికి తర్జుమాచేసి చెప్పవలయును. ఇందుచేత నాంగ్లములోనేయూహించి చెప్పఁగలశక్తిని యతని కలవడనేరదు. అతఁడు మాట్లాడునదియు స్వతస్సిద్ధముగా నుండక అతుకుల బొంతవలె తెచ్చిపెట్టుకొన్నదానివలె నుండును. కాబట్టి యీ పద్ధతి అంత మంచిదికాదు.

ఇటీవల అమలులోనికి వచ్చిన పద్ధతులలో సూటిపద్ధతి (Direct method) ఒకటి, దీని ప్రకారము భాషను గఱపునపుడు పుస్తకములు చాలసులభముగా నుండవలెను. చిన్నతరగతులందుపుస్తకములనుమాని ఉపాధ్యాయుఁడే నోటితో పిల్లలకు మాటలను సూచించుచు కొంత కాలము గడుపవలెను. తెలిసిన విషయములఁబట్టి తెలియని విషయముల నేర్పవలెను. (known to the unknown) కంటికి గోచరించు వస్తువులనుండి అగోచరములగు వస్తువులను విద్యార్థులుగ్రహించునట్లు చేయవలెను. ఇందులకై విద్యార్థులకుఁ గొంత శబ్దజాలముండవలెను. దీనికిగాను తరగతి గదులలో బాలురకుఁ

తెలిసినట్టి జంతుపటములు, బొమ్మలు, ఆటవస్తువులు, ఇతరవస్తుసామగ్రి ఉండవలెను. ఈపద్ధతినిబట్టి భాషా ప్రమాణము వాక్యముగాని శబ్దముగాదు. ఇందుచేత విద్యార్థులు త్వరగా ఒకదానిని గూర్చి వ్రాయఁగలుగుదురు. అనఁగా వ్యాసరచన కొలదికాలములోనే వారి కలవడును.

ఈ పై చెప్పిన రీతిని విద్యాబోధనము సాగించుట మాత్రము చాల కష్టము. మొట్టమొదట ఉపాధ్యాయుఁడు చాల తెలివితేటలుగల వాడై యుండవలెను. ప్రతి విద్యాసంస్థయు నాయా తరగతులకు వలయు వస్తుసామగ్రిని సమకూర్చుటకు ధనవంతమై యుండవలెను. ఇందుకుఁగాఁ ప్రతివిద్యార్థియు కొంతవఱకు మాతృభాష నేర్చియుండవలెను. ఇందే లోపముగల్గినను ఈపద్ధతి కుంటువడుట నిక్కము. కాబట్టి "డైరెక్టు మెథడ్" యొక్క శక్తిని మఱచిపోకుండ సాధ్యమైనంతవఱకు విద్యార్థులను ఇంగ్లీషు నేర్పునపుడు ఆంగ్లభాషా వాతావరణములోనే యుండునట్లు చూడవలెను.

ఇట్లుచేయుటకు ఉపాధ్యాయుడు విద్యార్థులను ప్రశ్నించుట, విద్యార్థులు తోడి వారిని ప్రశ్నించుట, చాల యవసరము. అప్పుడప్పుడు విద్యార్థులను దూరపుభూములకు, వస్తుప్రదర్శనశాలలకు, తీసికొని వెళ్లుటయుఁ జాల యుపయోగకరము. ఆయా విషయములను గూర్చి-వారు చూచినవి-తరగతులలో చర్చలు సలుపవచ్చును. ప్రశ్నింపవచ్చును.

"డైరెక్టు మెథడ్"లోని లోపములను తొలగించుటకై యిటీవల కొన్ని సవరణలు చేయఁబడినవి. అట్టివానిలో అమెరికా వారు కనిపెట్టినది "సూక్ష్మీకరణపద్ధతి" (Assignment System) ఒకటి. దీనినిప్పుడు చాలచోట్ల ప్రవేశపెట్టిరి. ఈ పద్ధతి ప్రకారము బోధకుడు ప్రేక్షకుడుగానుండి విద్యార్థులను సరియైన వాతావరణములో నుండునట్లు చూచును. మంచిపుస్తకములు పరికరములు, మొదలగునవి వారికిచ్చును. విద్యార్థియే ప్రతివిషయమును పుస్తకము నుండి చదివి, నేర్చుకొని, రికార్డుచేయును. ఈపద్ధతి పెద్దతరగతులకు చాల సరిపడి యున్నది. అయినను చిన్నతరగతులలోఁ గూడ పాఠము ముగిసినపిమ్మట కొన్ని ప్రశ్నలిచ్చి సమాధానములను వ్రాయించుటకూడ కొంతవఱకు దీని ననుకరించుటయే యగును. మాతృభాషా బోధనమునందును ఈ పద్ధతినిజాలవఱకుపయోగించవచ్చును. ప్రతి పాఠాంతమునఁ జేర్పఁబడు మాదిరి ప్రశ్నలు, లుప్తభాగ పూరణములు, ఈ పద్ధతిలోఁ జేరినవే!

ఇన్నిపద్ధతులున్నప్పుడు మనమే పద్ధతిని అవలంబించవలెను? అనునదియేప్రశ్న. అన్ని పద్ధతుల యుపయోగములను గ్రహించి విద్యార్థుల మానసికతత్త్వమున కనుగుణముగా నాయా పద్ధతులలోని మంచినెల్ల సంయోగపఱచి ఉపయోగించుటయే లెస్స. ఈవిషయములో "పద్ధతి బోధకునకుఁగాని బోధకుఁడుపద్ధతికిఁ గాదు" (Method for the teacher but not the teacher for the method) అను విషయమును మాత్రము మఱచిపోవద్దు. •

(బోధకుడు ఒకానొక పద్ధతికిఁ గట్టుపడక తనకు తానే తనబోధనమునకు సరిపడు పద్ధతి నేర్పఱచుకొనును. ఇదియే పై దానిభావము.)

# ప్రకటన

మా స్కూలులో పనిచేయుటకు సెకండరీగ్రేడు ట్రైనింగు ప్యాసయిన ఒక ఉపాధ్యాయుడు కావలెను. ట్రైనింగు ప్యాసయిన తన సర్టిఫికెట్టుతో ఆయన మా స్కూలుకు వీలైనంత త్వరలో రావలెను. ఈ యుద్యోగము ఒక్క సంవత్సరము వఱకు మాత్రమే! అనగా చేరిన తేది మొదలుకొని 31—3—43 వఱకు పని చేయవలెను.

వివరములకు:— చిల్లరిగె వెంకటరమణయ్య పంతులు,
మేనేజింగు హెడ్మాష్టరు,
హెచ్. యి. స్కూలు,
కొత్తపేట, × అంగలూరు. ×
(గుడివాడ రేంజి - కృష్ణాజిల్లా)

---

# కావలెను.

కనిగిరితాలూకా రామగోవిందాపురం హిందూహయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో సంగీతము, కుట్టుపని, తెలిసిన యొక ఉపాధ్యాయిని, సెకండరీగ్రేడ్‌గాని, హయ్యర్‌గ్రేడ్‌గాని, ప్యాసైనట్టివారు కావలయును. అట్టివారికి స్కేలుగ్రాంటు యివ్వబడును. మరియు గృహవసతి మొదలగునవి స్వల్ప వ్యయముతో యేర్పరచబడును. మిగత విషయములు యీదిగువ అడ్రసుకు వ్రాసి తెలిసికొనుడు.

మారెళ్ల కృష్ణయ్య మేనేజరు
హిందూహయ్యర్ ఎలిమెంటరీస్కూలు రామగోవిందాపురం
22—5—42 పెదచెర్లోపల్లె పోష్టు కనిగిరి తాలూకా నెల్లూరుజిల్లా.

---

# 108 కోట్ల జపయజ్ఞము

(లోకశాంతికి తగినమార్గము)

ఇందు పాల్గొనఁదలంచినవారు తమగురువుచే ఉపదేశింపఁబడిన ఒక మంత్రమునుగాని, అట్లు ఉపదేశింపబడనివారు "శ్రీరామ, శ్రీకృష్ణ" మొదలగు నేదేని యొక భగవన్నామమునుగాని రోజు 1 కి 108 మార్లకు తక్కువలేకుండ (ఎక్కువ సంఖ్య యెంతయైనను) జపించుచు ప్రతినెల ఆఖరున ఆనెలలోచేసిన జపసంఖ్య మొత్తము యీ క్రింది చిరునామాకు పంపవలెను.

అన్ని వివరములకు—

మేనేజరు, "మోక్షసాధని"
శ్రీరామ నామక్షేత్రము, గుంటూరు.

బహాదరుపేట బోర్డుయెలిమెంటరి కంబైండుస్కూలు కాళహస్తి వార్షికోత్సవము.

శ్రీ కాళహస్తి బహాదరుపేట బోర్డు ఎలిమెంటరీ కంబైండుస్కూలు వార్షికోత్సవము 5—5—1942 తేదీ సాయంత్రము 6 గం॥ శ్రీ చిత్తూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటువారగు శ్రీ టి. యన్. రామకృష్ణారెడ్డి, బి.యె., బి.యల్., యం.యల్.యె. గారి యాధిపత్యమున జరిగెను. ఉద్యోగస్తులు, బిడ్డల తల్లిదండ్రులు అనేకమందిపౌరులు సభకు వచ్చియుండిరి.

స్కూలు బిడ్డలవల్ల అనసూయ అను నాటకము ప్రదర్శింపబడెను. అందు ప్రధమబహుమతి జగదాంబ అను ఏడేండ్లబాలికకు అధ్యక్షులవారివల్ల గాంధిగారి బొమ్మ యివ్వబడెను. గంగ, నారదపాత్రలకు జూలుగంటి లక్ష్మయ్యసెట్టిగారు రజిత పతకములను బహూకరించిరి.

సంవత్సరాంత రిపోర్టులో స్కూలు హెడ్మాష్టరు శ్రీ టి. కె. నరసింహులు గారు తనకృషినిగురించి వెల్లడించుచు 200 నుండి 300 వరకు రోలును అనేక చేతి పనులను విహారములును పౌరులవల్ల స్కూలుకు కావలసిన కొన్ని ఉపకరణములును ఉచితముగా సంపాదించుటయు, నాటకప్రదర్శనములు, కుమ్మీ, కోలాటము, డ్యాన్సు హార్మోనియము యిత్యాది విషయములలో వృద్ధిచూపినట్లు చెప్పగా శ్రీ అధ్యక్షుల వారు స్కూలు రికార్డుల ననుసరించి చాలవృద్ధికరముగా నున్నదనియు ప్రతి సంవత్సరము యిట్లే వృద్ధిచూపిన చాల సంతోషమనియు యిట్టి ఉత్సవములు వెనుకంజవేయు స్కూళ్ళకు ఆదర్శప్రాయములనియు వెల్లడించిరి.

---

కొడవలూరు ప్రాధమిక ఉపాధ్యాయసంఘ వార్షికోత్సవము

కొడవలూరు బోర్డు పాఠశాలలో సదరు సంఘ వార్షికోత్సవము నెల్లూరు జిల్లాబోర్డు ఎడ్యుకేషనల్ ఆఫీసరు శ్రీ కె. దక్షిణామూర్తి నాయుడుగారి అధ్యక్షతను 26—4—42 ఆదివారం సాయంత్రం 4 గంటలకు జరిపిరి. సదరు వార్షికోత్సవమునకు నెల్లూరు రేంజి సీనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరువారగు యం శంకరయ్య పంతులు గారును, కోవూరు రేంజి సీనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరుగారగు కే వి. సుబ్రహ్మణ్య శాస్త్రిగారును, జూనియర్ డిప్యూటీ ఇనస్పెక్టరువారగు పి శరభాచారిగారును, కొడవలూరు ఫిర్కా జిల్లాబోర్డుమెంబరగు కే సుబ్బరామిరెడ్డిగారును, ఇంకను అనేక మంది ప్రముఖులును విచ్చేసిరి. పైసందర్భమున అల్పాహారవిందు గావింపబడెను. ఛాయాపటము తీయబడెను. సంఘకార్యదర్శిగారు సాంవత్సరిక నివేదికను చదివిరి. ఇంకను కొన్నివిషయములు పైవారిచే వెల్లడింపబడెను. కార్యదర్శిగారి వందన సమర్పణతో సభ విరమింపబడెను.

కొడవలూరు,
తే 27—4—42.

ఇట్లు తమవిధేయుడు,
☞ బరూరు శ్రీరాములు,
కార్యదర్శి.

# ప్రథమ వార్షికోత్సవము

మనుబోలు - నెల్లూరుజిల్లా

తేది 10—5—42 ఆదివారము 4 గంటలకు మనుబోలు బోర్డు మిక్సెడ్ పాఠశాల ప్రథమ వార్షికోత్సవము సదరు స్కూలు భవనమందు జరుపబడెను. నెల్లూరు రేంజి స్కూళ్ల డిప్యూటీ ఇన్‌స్పెక్టరు గారగు శ్రీ యం. శంకరయ్య పంతులు బి. యె., యల్. టి., గారు అధ్యక్షత వహించిరి. అల్పాహారవిందు చేయబడెను. శ్రీ వి. యస్. వెంకటనారాయణ, ఎం ఏ., బి. యిడి (నెల్లూరు) గారు ప్రాథమిక విద్యపై ఉపన్యసించిరి.

పోటీ పందెములలో గెలుపొందిన విద్యార్థులకు బహుమతులొసంగబడెను. తదుపరి అధ్యక్షునకు కృతజ్ఞతాభివందము లర్పించుటతో సభ ముగించబడెను.

ఇట్లు,
బి. ఆదిశేషయ్య,
హెడ్మాష్టరు,
బోర్డు మిక్సెడ్ స్కూలు,
మనుబోలు.

---

# వరహాపురము - రీడింగు సర్కిల్‌సభ.

13-5-42 వ తేదీ రాత్రి గం 7-30 ని కు ఈ గ్రామరీడింగు సర్కిల్‌సభ చోడవరం రేంజి స్కూళ్లసీనియర్ డిప్యూటీఇన్స్పెక్టరు వారగు శ్రీ చెముడుపాటి వేంకటేశము పంతులుగారి అధ్యక్షతను జరిగినది. వరహాపురముస్కూలు అసిస్టెంటు టీచరు గారగు శ్రీ దణ్యాంరాజు నాగభూషణరావుగారి మృదంగవాద్యముతో సభ ఆరంభించి ప్రార్థన గావింపఁబడెను. గ్రామోద్యోగులు, నౌకరులు, పౌరుబు, పెక్కండ్రు హాజరైరి. గతమీటింగు మినిట్సు వినిపించబడెను. 8-5-42 తేదీగల యుద్ధసంచికలోని అన్ని అంశములున్ను నెం 48/29-1-42 కరపత్రములోని సంగతులున్ను, V. C. O లుగా R. I. A. S. C లుగా కమీషన్లకై అర్హతలు, కొలువు నియమముల షరతులున్ను వినిపించడమైనది. మన విమానపుగుర్తుగూర్చి బోధించబడెను. పిమ్మట సభాధ్యక్షులు రెకూట్‌మెంటు కమిటీచేయు పనినిగూర్చిన్ని, అందు చేరువారినిగూర్చిన్ని, విపులముగా బోధించి వెళ్లుటకై ప్రోత్సహించిరి. ఇతర పత్రికలలోని యుద్ధవార్తలుగూడ వినిపించిన తరువాత సభ గం 10-30 కు ముగించడమైనది.

ప. శ్రీరామమూర్తి
సహాయకార్యదర్శి

వేమూరి వెంకట కృష్ణమసెట్టి అండ్ సన్సు వారి, ఎ కణ్ణన్‌సెట్టి అండ్ కో., 288, ఎస్ప్లనేడు - మద్రాసు వారిచే ప్రచురింప బడుచుండెడి "ఆనందాశ్రమ గ్రంథ రత్నమాల" పుస్తకము లన్నిటికిని మేము సంపూర్ణ హక్కుదార్లమై యున్నాము ఈ పుస్తకములకును యితర పుస్తకములకును, యీదిగువ చిరునామాకు వ్రాయవలయును భారీగా ఆర్డరిచ్చువారికి మంచి కమీషను యివ్వబడును

## శ్రీమద్భగవద్గీతా-ప్రతిపద టీకాభాష్య విశేషార్థ సహితము.

| | | |
|---|---|---|
| క్యాలికో బైండు, గిల్టుపేరు గలది | 3 | 4 0 |
| డిటో ఆంధ్రతాత్పర్య సహితము, క్యాలికో బైండు | 1 | 4 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 1 | 0 0 |
| డిటో ఆంధ్రవచనము చిన్నసైజు, క్యాలికో బైండు | 0 | 6 0 |
| డిటో డిటో రేపర్ బైండు | 0 | 5 0 |

## శ్రీమదాంధ్రమహాభారతము.

| | | |
|---|---|---|
| 1 ఆది, సభాపర్వములుగల సంపుటము | 2 | 0 0 |
| 2 అరణ్యపర్వము | 2 | 0 0 |
| 3 విరాటోద్యోగ పర్వములు. | 2 | 0 0 |
| 4 కర్ణ, శల్య, సౌప్తిక, స్త్రీపర్వములు | 2 | 0 0 |
| 5 భీష్మ, ద్రోణ పర్వములు | 2 | 0 0 |
| 6 శాంతిపర్వము | 2 | 0 0 |
| 7 ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణ పర్వములు గల సంపుటము | 2 | 0 0 |
| 1 ఆదిపంచకము - ఒకటే సంపుటము | 5 | 8 0 |
| 2 యుద్ధషట్కము డిటో | 3 | 12 0 |
| 3 శాంతిసప్తకము. డిటో | 3 | 12 0 |
| భాస్కరరామాయణము | 4 | 0 0 |
| శ్రీకృష్ణకర్ణామృతము | 1 | 8 0 |
| శ్రీరామకర్ణామృతము | 1 | 8 0 |
| భర్తృహరిసుభాషితము | 2 | 0 0 |
| అమరకోశము-త్రికాండము-సటీకము క్యాలికోబైండు చేయఁబడినది | 1 | 4 0 |
| డిటో అట్టబైండు | 1 | 0 0 |
| హరిశ్చంద్రోపాఖ్యానము అట్టబైండు | 0 | 6 0 |

## శ్రీమదాంధ్ర మహాభాగవతము (పద్యకావ్యము-పోతనప్రణీతము)

| | | |
|---|---|---|
| సంపూర్ణ ప్రతి ఒకే సంపుటము | 5 | 0 0 |
| సంపూర్ణప్రతి రెండుసంపుటములుగా | 6 | 8 0 |
| సంపూర్ణప్రతి మూఁడుసంపుటములుగా ప్రథమ, ద్వితీయ, తృతీయ చతుర్థస్కంధములు క్యాలికోబైండుగిల్టుపేరుగలది | 2 | 8 0 |
| పంచమ, షష్ఠమ, సప్తమ, అష్టమ, నవమస్కంధములుగల సంపుటము క్యాలికోబైండు, గిల్టుపేరుతో | 2 | 8 0 |
| దశమ, ఏకాదశ ద్వాదశ స్కంధములు గల సంపుటము క్యాలికో బైండు, గిల్టుపేరు గలది | 2 | 8 0 |
| గజేంద్రమోక్షము-క్యాలికోబైండు | 0 | 8 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 0 |
| రుక్మిణీకల్యాణము-క్యాలికోబైండు | 0 | 8 0 |
| డిటో అట్టబైండు | 0 | 6 0 |
| నలచరిత్రము - అట్టబైండు | 0 | 6 0 |
| ముకుందమాల -సటీకాతాత్పర్యము | 0 | 4 0 |
| ఆదిత్యహృదయము-సటీకాతాత్పర్యము | 0 | 2 0 |
| నీతిశాస్త్రము, సటీకాతాత్పర్యము | 0 | 2 0 |
| భజగోవింద శ్లోకములు టీకాతాత్పర్యసహితము | 0 | 2 0 |
| శ్రీలక్ష్మీనృసింహ స్తోత్రము టీకాతాత్పర్య సహితము | 0 | 2 0 |
| శ్రీ సహస్రనామ స్తబకము క్యాలికో బైండు చేయఁబడినది | 0 | 8 0 |
| రేపరు బైండు | 0 | 6 0 |
| శ్రీ గోపాల సహస్రనామ స్తోత్రము | 0 | 1 0 |
| సప్తమస్కంధము - మూలము | 0 | 3 0 |
| భోగినీ దండకము | 0 | 1 0 |

## రామా అండ్ కో.,

హెడ్డాఫీసు:—ఏలూరు, బ్రాంచెస్:— మదరాసు-గుంటూరు-రాజమండ్రి.




1941 వ సంవత్సరపు నూతన సిలబసు ననుసరించి

# ప్రాథమిక భూగోళములు

శ్రీ K వెంకట్రావు B A, L T, గారిచే

2 - 3 - 4 - 5 - 6 - 7 - 8 తరగతులకు

వలయువారు:— రామా అండ్ కో.,

ఏలూరు - మద్రాసు - గుంటూరు - రాజమండ్రి.